



mankamma thota labour adda

telugu poetry by
annavaram devendar

మంకమ్మతోట లేబర్ అడ్డా - అన్నవరం దేవేందర్ - కవిత్వం

# మంకమ్మ తోట లేబర్ అడ్డా

- అన్నవరం దేవేందర్

# మంకమ్మతోట లేబర్ అడ్డా

కవిత్వం: **అన్నవరం దేవేందర్**

బొమ్మలు: **అన్నవరం శ్రీనివాస్**



**నూతన సాహితి**

హుస్నాబాద్-కరీంనగర్.

MANKAMMATHOTA LABOUR ADDA

poetry (2004-2005)

by ANNAVARAM DEVENDER ©

first edition : October 2005

cover painting and inside illustrations :
by Annavaram Srinivas, cell: 9849008054

copies available at :
poet,
9-5-148, Sapthagiri Colony
Karimnagar-505 001. A.P.
cell : 9440763479
and all reputed book houses

Nuthana Sahithi prachuranalu
publication No. 8

D.T.P. and Book making at :
Pathipaka graphics & digitals,
Sircilla - 505 301.
Cell: 9440022075

Rs. 75/-
$ 5



# దస్తావేజు

పార్థివనామ సంవత్సర భాద్రపద పెద్దల అమావాస్య, సరియైన తేది 3-10-2005 రోజున వయ్యి:'మంకమ్మతోట లేబర్ అడ్డా' కర్త: అన్నవరం దేవేందర్ సాకిన్: పోతారం(యస్) మండలం: హుస్నాబాద్ జిల్లా: కరీంనగర్‌కు, క్రియ: 'కవిత్వం' కర్మ: జూకంటి జగన్నాథం సాకిన్: తంగళ్ళపల్లి మండలం: సిరిసిల్ల జిల్లా: కరీంనగర్ రాసి ఇచ్చిన దస్తావేజు ఏమనగా!

ప్రాంతం, భావజాలం, రాజ్యం మూకుమ్మడిగా జనజీవనాన్ని అతలాకుతలం చేస్తున్న వేళ అట్టడుగు వర్గాల భాషా సంస్కృతులను తరతరాలుగా దొంగ దెబ్బతీస్తున్న సమయం. ముందెప్పుడు లేనంత వెనుకబడ్డ కులాల మూలాల కదలికలను వేనోళ్ళగా కవిత్వంలో కథల్లో నమోదు చేస్తుంటే, E.C.G. తీస్తుంటే తతిమ్మ కులాల వారి కళ్లల్లో కనిపించని చింతనిప్పులు పోసుకుంటున్నయాల్ల. ఎత్తుల్ని, తొత్తుల్ని, జిత్తుల్ని, పొత్తుల్ని అదే రణనీతితో వివిధ సాహిత్య నిర్మాణ ప్రక్రియల్తో చిత్తు చేసి నిటారుగా తలెత్తుకుంటున్న పొద్దు-

ఇదిగో అన్నవరం దేవేందర్ తన ఊరు పోతారం నుంచి 'తొవ్వ'ను దొరుకవట్టుకొని, తన నీడ హుస్నాబాద్ నుంచి 'నడక'ను సాగించి ఇప్పుడు కరీంనగర్‌లోని 'మంకమ్మతోట లేబర్ అడ్డా'తో తెలుగుకవిత్వంలో అడ్డా బిఠాయించిండు. అదిగో అక్కడినుంచి తేపతేపకు గోసగోసోలె చూసుకుంటూ తన కండ్లల్ల నీళ్లు కండ్లండ్లనే కుక్కుకుంటూ ఊరు, నగరం ఆధిపత్య ప్రాంతం, రాజ్యం, అమెరికాలను ఒక సనసన్నని బాధతో ఒక గుండెపగిలే వేదనతో తన మట్టి ధిక్కారస్వరభాస్వరంతో మంటపెడుతున్నాడు.

అంతేగాక! 1948, సెప్టెంబర్ 17 నుండి 1956 అక్టోబరు 31 వరకు ఉన్న తెలంగాణా రాష్ట్రం ఒక ఎత్తైతే, 1956, నవంబర్ 1 నుంచి నేటి వరకు కలుపుకున్న ఆంధ్ర రాష్ట్రంలో తెలంగాణ అన్ని విధాలుగా పోగొట్టుకున్న క్రమం మరో మహావిషాదం.

భాష ఒక్కటే అంటూ తెలంగాణా ప్రజలు మాట్లాడే భాషను కించపరచడం– క్రిష్ణా గోదావరి నదుల నీళ్లను కాజేయడం – ఉన్న కొన్ని ప్రాజెక్టుల కిందఉన్న తరిభూముల్ని చాపకింద నీరులా కబ్జా చేయడం – ప్రాంత సంస్కృతి మొత్తాన్ని మెల్లమెల్లగా కుత్సితంగా ధ్వంసం చేయడం – చేసిన చేస్తున్న మోసం కుట్రల్ని గమనించి కళ్లు తెరిచేసరికి అసెంబ్లి 'పాసంగపు' పశుబలం మరింత గాయం చేసింది. అవతలివాని కుతంత్రాలకు మనోని వెన్నుపోట్లకు ప్రజలు యుద్ధానికి తయారై కాకుండనే ప్రతిసారీ క్షతగాత్రం అయ్యారు. ఇది ఎంత దూరం పైలాయించిందంటే బతుకులు తెర్లుతెర్లై ఆకలి చావులు, ఆత్మహత్యల వరకు కొనసాగింది.

ఇది ఇలా జరుగుతుంటే రాజ్యం ఇక్కడ జరుగుతున్న ఆర్థిక, రాజకీయ, సామాజిక ఉద్యమాల్ని కేవలం 'శాంతి భద్రతల' సమస్యగా చిత్రీకరించి అశేష ప్రజల చిరకాల కోరిక నాలుక సందున ముల్లు గుచ్చింది – మరోవైపు మారుతున్న జాతీయ అంతర్జాతీయ మౌలిక మార్పులను అర్థం చేసుకోకుండానే ఉద్యమాలు శత్రువును టార్గెట్ చేయడంలో పాక్షికంగా వైఫల్యం చెందాయి. ఊర్లు ఊర్లుకాకుండా పోతున్నాయి – మనుషులు మనుషులకు కాకుండా రూపెత్తుతున్నారు – తెలంగాణతెలంగాణంతా నెత్తుటితో తడిసి ముద్దైపోయింది. కనీసం కారిన నెత్తుటికి తక్షణం రక్తదానం చేద్దామన్నా చాలామంది ఇక్కడ పనిలేక దొరుకక 'ఎనీమియా'తో దనుసుక దనుసుక మొస తీస్తున్నారు.

తన ప్రాంతమంటే తన పలుకంటే తన ప్రజలంటేనే కవి ముఖచిత్రం – ఆయా సమాజాల ఆయా ప్రజల ఆయా కాలాల ఆయా సంస్కృతులలో ఎదుగుతున్న చేనులో పెరుగుతున్న కలుపుమొక్కల్ని పీకేసి, మొక్క మొక్కకు తవుటం పెట్టి ప్రాణానికి ప్రాణం ఎదురేసి మొక్క మొదలును జీవధారతో తడిపేదే కవిత్వం. అందుకే అన్నవరం దేవేందర్ ఇంత తండ్లాడుతుండు. పెనుగులాడుతుండు. కోపం, దయ దక్కన్ దుఃఖసముద్రపు ఉప్పదనంతో రగిలిపోతుండు. కంటిమీద రెప్పవాలనీయని తడి అక్షరం. దేవేందర్ కవిత్వంలో కమ్ముకూలిన బండి చక్రం – గండిపడ్డ చెరువు – ముసలి తల్లి దండ్రుల్ని ఇంటి ముందు సాయమానులో వదిలి, పనికోసం సమీప పట్టణాలకు నగరాలకు, దూర దేశాలకు వలసపోతు ఇండ్లకు తాళం వేసిన ఊరు – ఏకకాలంలో మన కడుపులో చేయిపెట్టి దేవినట్టూ మన భుజంమీద చేయివేసి భరోసా ఇచ్చినట్టు అనిపిస్తుంది. కనిపిస్తుంది. వినిపిస్తుంది. మనల్ని మొత్తానికి మొత్తం చెల్పి యిడిసిపెడుతుంది.



'బొంకియ్యం బోర్లెయ్యం బుదురకియ్యం
సాఫ్ సీదా ముచ్చట
బల్ల గుద్దుడే గల్లపట్టుడే గెదుముడే
కుండ పల్గొట్టినట్టు కుల్లం కుల్లం
తేటతెల్లం తెలంగాణం'

మాట్లాడాల్సి వచ్చినప్పుడు నీళ్లు నమలడం నేరం. నిలబడాల్సిన వైపు నిలబడక ముయ్యర ముయ్యరలాడడం భ్రూణహత్య. ముందు మనిషిగా మనలేనివాడు కవిగా జీవించడానికి అనర్హుడు.

'ఒక సాకారమవుతున్న స్వప్నం
సారవంతమైన జ్ఞాపకం
కైకడుతున్న కడుపుకోత
సరాయించు కున్న గొంతు'

ప్రపంచీకరణ భూకంపం తాకని నేలలేదు. కూలని ఇల్లులేదు. కాలనికడుపూలేదు.

'ఊరు ఊరంతా మార్పు చెందుతున్నా
గడి గుడీ పదిలంగానే ఉంది
చింతలు యాపలు పెరిగి విరుగుతున్నా
మర్రి మాత్రం కొత్త ఊడలతో నిలబడుతుంది'

ఎల్లప్పుడూ ప్రశ్న కవికి వేటకొడవలి కాకుంటే మనల్ని అప్రమత్తంచేసే కావలి కుక్క.

'పోగుల రాయమల్లు
పొలగాండ్ల సంపి తనెందుకుసచ్చె
పిట్టల సుశీల
పిడాత బాయిలెందుకు దునికె'

'అడుగుల్లేని కడుముంతలు
నీళ్లు ముల్లెగట్టినట్టు మాట్లాడకుండ్రి'

'భుజం కాయ కాసుడు
జాకెట్ మీద శిల్లులు
ఒంటి ఊపిరి పాణం
కింద మీద చెయ్యరాదు
ఏం చేయ్యాలె వదినె
నీళ్లంటే సావత్తంది
నీళ్లంటే కండ్లల్ల నీళ్ళే...'

నీళ్లు లేకుండా కాదు - నీళ్లుండీ నీళ్ళకు కాకుండా చేయడమే తెలంగాణా దుస్థితి. ఉమ్మడి ఆంధ్రరాష్ట్ర దుర్మార్గ ప్రవృత్తి. దేవేందర్ కవి సమయాల్ని చూడుండ్రి.

'ఏకాంతం నిశ్శబ్దం
ఏకాంతం అంటే
ఏకాకితనం కాదు సమూహమే!'

'మన మాటలలోనే పొంచి ఉన్న శత్రువులు
మన మాటలలోనే అల్లుకునే స్నేహితులు
మాటలు అనందపు బాటలు కావాలి
మాట్లాడితేనే మనస్సుకు నిమ్మళం
మాట్లాడుకోవడం మనుషుల్ని కలిపే తీగ'

'ఊరి ఆకాశంలో
ఉసురు మేఘమై ఉరుములురుముతంది'

కవి ప్రజాసమూహాల్లోని దుష్మన్ కదలికలను పసికట్టే 'రాడార్'. ఎక్కుపెట్టిన క్షిపణి. శత్రువు భూభాగంపై నిశ్శబ్దంగా దండెత్తే జలాంతర్గామి.

'పాము ఎన్నటికైనా పామే
పాము సోపతి పడగ నీడే
చరిత్ర కమ్మలు మర్లేసి సూడు
కమ్మ కమ్మలో
కమ్ముకున్న దగా కన్పిస్తది'



అగ్రవర్ణాల సాహిత్య పెట్టని కోటగోడల్ని అట్టడుగు వర్గాల కలం యోధులు తమ సృజనాత్మక ప్రక్రియ ఆయుధాలతో కూలగొట్టే పనిని షురూ చేసారు.

'అవ్వా
అలగ్ అలగ్ అంటే
ఇల్లు ఒక్కటేనే!
కుండనే వేరు
దేశం ఒక్కటే
రాష్ట్రాలు వేరువేరు'

దేశంలో ముఖ్యంగా తెలుగులో రానున్న కాలమంతా బహుజన సాహితీకారులదే. మట్టికాళ్ల పాదముద్రలు. పొయ్యిని, ఇంటి ముందర గద్దెలను ఎర్రమన్నుతో అలికిన తరువాత స్త్రీలు పాలు సున్నం కలిపి చుక్కలుగా లతలుతీగలుగా తీర్చిదిద్దే నిమాయిష్- నిండా నీళ్లులేని చేదబాయిలోంచి కన్నీళ్ళను చేదినప్పుడు దరులకు తాకి దెబ్బలుతిన్న బొక్కెన - పశువుల అంగడి గోస - గుండె కలుక్కుమనడమే - చిన్న పిల్లాడు నడుచుకుంటూ పడ్డప్పుడు కొట్టుకుపోయిన మోకాలిచిప్ప నొప్పి - పాల్కురికి సోమనాథుడు మరియు వరకవి సిద్ధప్ప కవిత్వ తత్వ చింతన, పద సంపద. అసలు అన్నవరం దేవేందర్ రూపాయికి సోలాణా తెలంగాణా కవి. ఒకానొక తెలుగు ప్రాతినిధ్య కవి.

ఇది నా మనసు పూర్తిగా రాసిచ్చిన పత్రం. సహి.

ఇట్లు

జూకంటి జగన్నాథం

(జూకంటి జగన్నాథం)

సాక్షులు :

1) నలిమెల భాస్కర్ [signature]
2) మద్దికుంట లక్ష్మన్ [signature]
3) పత్తిపాక మోహన్ [signature]
4) పెద్దింటి ఆశోక్ కుమార్ [signature]
5) కొలిపాక శోభారాణి [signature]

## అడ్డా మీద నిలబడ్డ కవితలు





# కదలిక

ఎల్లలు ఎన్ని దాటినా
నా మట్టి వాసనే నాకు పులకరింత

పెన వేసుకున్న ఊరి బంధం
దూరం పెరిగిన కొద్దీ పెరుగుతుంది

నా ప్రాదేశికత ముందు
ప్రపంచీకరణ గుడ్డపేలిక

అమ్మఒడి చదివిన బడి
తిరిగిన వాకిలి పెరిగిన ఇల్లు

పసందైన సోపతులు
స్థాన బలిమి చిహ్నాలు

ప్రపంచ వాణిజ్యం ప్రచండమై
గ్రామ వికాసాన్ని ఆర్పేసింది

చేతి పనుల ఇరుసులు విరిగిన ధ్వని
నాలుగు వక్కలైన నాగలి కర్రు
దేశీయత దేహం గాయమైంది

భూగోళీకరణ అగ్ని
దేశ దేశాలకు అంటుకుంటున్న నిప్పు



విస్తరిస్తున్న విశ్వీకరణ
ప్రాంతీయాత్మే ప్రతిఘటన

1-1-2004

* ప్రజాతంత్ర వారపత్రిక,
జనవరి 5-11, 2004





# వరుసలు

ఊరి నిండా మంది
దూరదూరంగా మెదులుతున్నా
ఒక్క ముల్లెలో దాగిన కలయిక
తీరు తీరు మనుసులున్నా
ఒక్క తరీఖ ఒక్క రివాజు

పూసిన తంగెడుపూలు
తాంబాలంలో బతుకమ్మయినట్లు
పల్లెకడుపు నిండా
అందరికందరు కలుస్తారు

మనిషి మనిషికీ మధ్య
'మనువు'గాని అంతరాల అరలున్నా
అంతా చుట్టాలే

అమ్మా మనవడు - తాతా మనవరాలు
మందలిస్తేనే శక్కల్‌గులగులల పరాశికాలు

బావా బామ్మర్ది - వదినే మరదలు
వైనంగానే సరసాల వాన తుంపర

అత్తా కోడలు - మామా అల్లుడు
తమ్మీ అన్నా చిన్నమ్మ చెల్లె చిచ్చా...
వాడవాడల్లో చేను చెలకల్లో



నోరార పిలుపులు కడుపునిండా ముచ్చట్లు
నాలుగైదు పెత్తనాల ఇండ్ల నీలిగే నక్కల్ని ఇడిసిపెడితే
ఊరు ఊరంతా దసర జమ్మి!

2003 డిసెంబర్ 31 జనవరి 1, 2004 మధ్య రాత్రి

* నేటి నిజం దిన పత్రిక,
తేది: 3-4-2004





# కుల్లం కుల్లా

అరుగుమీదనే ఇగురం
మాయ తెల్వని మర్మం





# గుండె పాట

తెలంగాణా! తెలంగాణా!
నీ యాది మతిలకస్తే
పెయ్యి పులశిల్లుతది
సంబ్రమైన మనాది
మూటగట్టిన మురిపెం
ఎన్నీల ఎలుగు
అలికిన అరుగు
తీనెల బొట్లు
పున్నం రాత్రి
ఇరుగ పూసిన గోగు

తెలంగాణా! తెలంగాణా!
ఎంత పెద్దంత్రం నీది
నిండుగ పారిన ఒర్రె
పొదుగు నిండిన పాలు
చెంగలిచ్చిన ల్యాగ
కిర్రుమన్న ఇరుసు

గోరుకొయ్యల పొద్దు
గొర్రెంకల ఒర్రుడు

ఆయిటి వాన
మడికట్ల వాసన
ఎంత నిండుది
ఎంత గొప్పది
నా తెలంగాణా
ఎంత పెద్దిర్కం నీది
రాజిర్కం ఎటు వాయె

అవ్వా తెలంగాణా!
తల్లీ తెలంగాణా
నిన్ను యాజ్జేసుకుంటం
నిన్ను మతిల బెట్టుకుంటం
బతుకమ్మ పాటలల్ల
బద్దీక ఆటలల్ల
చిర్రగోనె చిరుతల రామాండెం
బోనాల పండుగ్గోలె



డడ్డెంక డెం డడ్డెంక డెం
డప్పు సప్పుల్లల్ల
కిన్నెర రాగాలల్ల
నిన్ను తల్సుకుంటం

నీవు
ఒక సాకారమవుతున్న స్వప్నం
సారవంతమైన జ్ఞాపకం
కైకదుతున్న కదుపుకోత
సరాయించు కున్న గొంతు

పిడికిలి నీవే
కొడవలి నీవే
కదలి నీవే
రాజిర్కం కోసం
రణం చేస్తున్నం
జెండవు నీవే
తెలంగాణా నా తెలంగాణా

17-1-2004

* 2004 శాతవాహన కళోత్సవాల్లో పఠనం
* నేటి నిజం దిన పత్రిక, 30-4-2004






# ఆనవాలు

ఏండ్లకేండ్లు గడిచిన తర్వాత
పెరిగిన ఊరంతా కలె తిరిగాను
పొలిమేరల్లోనే జ్ఞాపకాల రీల్లు
మనస్సు పొరల్లో తేలిపోతున్నాయి

దోర దోర పండ్లు బుర పండినట్లు
మనుషుల ముఖాలన్నీ పండ్లు పండ్లు
ముఖాలే కాదు దేహాలు కూడా
అనుభవాల ముడుతల మడతలు

పిట్టగూడులా పెరిగిన తల వెంట్రుకలు
పక్షులెగిరి గూడు నేల రాలినట్లుంది

వెండి తీగల వలె నెత్తంతా నెరిసి
పెద్దరికాన్ని పులుముకుంది

తెరిచిన నుంచి కలలుగన్న నయనాలు
అలిసిన చూపుల్లోంచి అద్దంలా మెరుపు

బాల్యం యవ్వనమై ఉరికింది
యవ్వనం నడీడులో నిలిచింది
గిరకలా గిర గిరా తిరిగింది కాలం



ఊరు వాడలన్నీ తిరిగి తిరిగి
ఇంటి ముందు అరుగు మీద కూర్చున్న

మూల నున్న బంగ్వాయి ముట్టుకున్న
ఆనందంతో గుండె అల్కగైంది

మార్పు..... మార్పు నిరంతరం మార్పే
ఊరు ఊరంతా మార్పు చెందుతున్నా
గడి గుడీ పదిలంగానే ఉంది
చింతలు యాపలు పెరిగి విరుగుతున్నా
మర్రి మాత్రం కొత్త ఊడలతో నిలబడుతుంది

28-1-2004

* సోయి త్రైమాస పత్రిక
సంచిక 2, 2004

# విశ్రాంత యోధుడు

అడవి వెన్నెలకు నెరిసిన శిరస్సు
తుపాకీ మెరుపులాంటి చిరునవ్వు
చూపు లోంచి విచ్చుకున్న గరిక పువ్వు
నిలిచి పోయిన అలలా నిర్మలమైన మనస్సు



మట్టిలో పుట్టి చెట్లలో పెరిగి
కడలితో కరచాలనం చేసి
స్వప్న సంకల్పం కోసం
యుద్ధ ఖడ్గాన్ని ముద్దాడిన వాడా
వణుకుతున్న వయస్సులోనూ
విప్లవాన్ని కలగంటున్న స్వాప్నికుడా
గాయాల నెత్తురు స్రవిస్తున్న పథికుడా

ఉద్యమాల నెలబాల్యం నుంచి నెలవంక దాకా
ఉరికంబం మీంచి మరో జగత్ వీక్షించి
ఊహల ఉయ్యాలలో ఊసులాడి
నర్రెంగ కింది బందూక్ అందుకున్న భాస్కరా
చిరుగాలి సితారా సంగీతాన్ని మీటిన వాడా!

స్వప్నం కోసం అలలు అలలుగా కలగన్నావు
ఘనీభవించిన ఆ కలల హోరును
తిరిగి తిరిగి ఆవిష్కరిస్తున్న విశ్రాంత యోధుడవు

2-2-2004
శివసాగర్‌ను మొదటిసారి చూసి
చాలా సేపు ముచ్చట పెట్టినంక

# అడుగు లేని కడుముంత

ఇప్పుడైతే వంగి వంగి దండాలు
అటెనుక దండం అన్నా దొరుకరు
అయిదొద్దులు సుట్టు తిరుగుతరు
అయిదేండ్ల దాక సుట్టు తింపుతరు

శక్కరి శిల్కల ముచ్చట్లు
రామ చిలుక పలుకులు
లేని లేని వరుసలు
అరచేతిలో వైకుంఠం
కండ్ల ముందే సూపిస్తరు

సుక్కల్ల సందమామ దూసుకచ్చి
ఇప్పుడే కీసల పెడుతనంటరు
నోట్లె నాలిక లేక మేం ఓట్లేస్తే
సీట్లల్ల కూకొని కోట్లు కుప్ప చేత్తిరి



పోగుల రాయమల్లు
పొలగాండ్ల సంపి తనెందుకుసచ్చె
పిట్టల సుశీల
పిడాత బాయిలెందుకు దునికె

పడుసు పోరగాండ్లు
ఇల్లు ఇడిశి ఎందుకు ఎల్లి పోతుండ్రు

ఎంకటరావు దొర ఏక్సంట్ కార్ల తిరుగంగ
ఎనుగుల ఎంకటిగాని కచ్రం ఎట్లా ఇరిగింది

మా ఓట్లకు పుట్టిన బాపులు
జర జెప్పుండ్రి అయ్యలాల
అడుగుల్లేని కడుముంతలు
నీళ్లు ముల్లెగట్టినట్టు మాట్లాడకుండ్రి

20-3-2004

* మానేరు, టైమ్స్ దిన పత్రిక 21-3-2004
* 'బ్యాలెట్-బ్యాలెట్' కవితా సంకలనం 2004





# సందుగ

ఏండ్ల కేండ్లు ఎల్లి పోంగా పోంగా
అటుకు మీంచి పాత సందుగ
దించి సూత్తి
ఒక్క మల్క పాత మురిపాలు
కండ్లల్ల కలె తిరిగినయ్

సందుగంటే ఎవ్వలకైనా ఆత్మే
అమ్మా తాతల కైతే పాణాపాణం
రైక కనుములు పట్టు పితాంబురం
దోతుల జోడ సోలపురం శద్దరి
అన్నీ అండ్ల దాపెట్టి కాపాడేది

సాలెన్ కడాలు పట్ట గొలుసులు
పట్టెడ ఒడ్డాలం ముక్కుపోగు
సందుగలో పక్క తళతళా మెరుపు
పండుగలు పబ్బాలు లగ్గాలప్పుడు
డాంబర్ గోలీల వాసన కమ్మగా కమ్ముకునేది

మూతకున్న సొరుగుల
జన్మ పత్రికలు పట్ట కాయిదాలు పెట్టుబోతల లెక్కలు
ఎల్లకాలం పైలంగుండె
తాతలనాటి సందుగ
ముట్టుకుంటేనే సంబురం సంబురం

కొన్ని ఇసిరెలు యాడ వదుతె అన్నే ఉంటే
కొన్నిటి తావులు ఉండే కాన్నే ఉంటయ్



మొలుదారంకు యాలాడే తాళం చెయి
దుగుట్ల దీపం కింద పావుల నైవులు
తనిబ్బిల వయ్యికింద పోంటీన్
దూలం మీద దాగున్న మీసం కట్టె
శిల్కొయ్యకు తగిలిచ్చిన ఎడ్ల గంటలు
గాజె బొత్త మీన జల్లెడల సద్దుల ముద్దలు
లక్ష్మిందేవి పట్వల శారెడు ఎండి బిల్లలు
దొంతి కుండలల్ల ఇత్తునపు గింజలు
గుబ్బిగద్ద కింద అనిగిన మోతుకు ఆకులు
దర్వాజ బండ మీద పొగాకు కట్టలు

దాసుకున్న తావులన్ని సూస్తాంటే
సందుగలున్న సనుగులన్ని
మదిల మెదులుతన్నయి

ఇప్పుడు సూడవోతె
సందుగ తాళం అనుం శెడిపోయింది

28-4-04

* 'వార్త ఆదివారం' 26-9-2004





# కువ్వారం

ఎక్కడో ఇరాకీ కన్నీళ్లను సైతం
తూడ్చిన కలం
అమెరికా అహం మీద నిప్పులు పోస్తుంది
జాతి వివక్షలన్నింటిని చెండాడుతున్న పెన్ను
గుజరాత్ గాయాలకు సుత కన్నీళ్ళు రాలుస్తుంది
సకల అన్యాయాలపై సిరా విదుల్చుతూ
తెలంగాణా ఆరాటానికైతే కిక్కురుమనదు

పోరాటాలకు ప్రాణవాయువై
ఆరాటానికి ఆండగా ఉండే సిరా చుక్క
ప్రాంతం ఆకాంక్షలకేమో కువ్వారం పడుతంది

పాలమూరు నోట్లో మన్నుగొట్టి
ఉన్న నీళ్లన్నీ కొల్ల గొడుతున్నరు
వెయ్యిల మంది పోరల పొట్టలు గొట్టి
సక్కదనపు కొలువులన్ని కమాయించుకునిరి
యాసబాసల మన్నువోసి మాయచేసి
తేట తెలుగని కాటగలిపిరి

సత్తెనాశనం చేసి ఇంకా సవరిస్తరట
తెల తెలంగాణం అంతా తెర్లయిపోతంది

కండ్లులేనోల్లు చూసినా
అధర్మం కండ్ల మెరుస్తుంది
ఎవ్వలు చేసినా
అన్యాయం అన్యాయమే కదా



కవీ! కువ్వారపు కుబుసం
పాయదేర్ల తనం ఇడుపు
తెలంగాణాను కైయిత్వం చేస్తే
కండ్ల కద్దుకుంటం

(తెలంగాణపై నోరు తెర్వని ప్రగతి శీల కవులకి)

మే 2, 2004

* ఆంధ్రజ్యోతి 'వివిధ'
31-6-2004.





# నీళ్లంటే... కన్నీళ్లే...

ఒక్కసుక్క.. ఒక్కొక్క సుక్కనే
బొట్లు బొట్లుగా జారి పడతయ్
జెప్పజెప్పరావు బిందె నిండది

నల్లకాడికి వంటింట్లకు
వంటింట్లకూ వాకిట్లకు
ఆడికీడికి అసు పోసినట్టు
ఒక్కటే తిరుగుడు తిరగవడ్తి

పొల్ల ఏడ్సుడు నల్లా ఇడ్సుడు
పాలు పొంగుడు ఓరకుండుడు
చిత్తెరి అన్నీ ఒక్కపారే...

నాలుగొద్దులకోపారి వచ్చే నీళ్లకు
నల్లకాడ లొల్లి లొల్లి
ఆపతి సంపతిల పాణం ఇచ్చుకొని
ఎప్పుడూ కూడుండే ఆడోళ్ళం

రెక్కంత పోతది రొంబొచ్చె నొత్తది
గెల్కుం గెల్కుం. గెల్కుం గెల్కుం
ఎక్కడికో దిగిపోయినయి
పాతాళంలో ఉన్న నీళ్ళు
ఊరిచ్చుకుంట కొడితె
కశ్కదు కశ్కదు సుక్కలు
శిలుం శిలుం వాసన
బిందెలు మోసి మోసి
జబ్బదెబ్బ లేస్తంది

భుజం కాయ కాసుడు
జాకెట్ మీద శిల్లులు
ఒంటి ఊపిరి పాణం
కింద మీద చెయ్యరాదు
ఏం చేయ్యాలె వదినె
నీళ్లంటే సావత్తంది
నీళ్లంటే కండ్లల్ల నీళ్ళే...

20-5-2004

* 'విశాలాంధ్ర, సోమవారం'
23-8-2004



నీళ్ళు జెయ్యవట్టి కొట్లాడుతున్నం
నీళ్ళ తిప్పలు చెప్పరాదు
పావుగంట పనికి పొంటె పోతది
సోదు లేకుంటే పంటం గానీ
సుక్కనీళ్ళు లేకపోతే ఎల్లుద్దా
పోరడు పోసినంత రావు గని
శాంతాడు పొడుగు లైను

నాకట్టం ఎవలకు ముట్టాలే
ఇంటినిండా మొగోల్లు
చెట్లోలె నిలబడుతరు
కుర్చోలె కూకుంటరు
ఆడీకిడికి ఉత్తగ తిరిగి
జాము చేత్తన్నవని గద్రిస్తరు

ఇటున్న పుల్ల అటుపెట్టరు
చేసి చేసి నారెక్కలు పాయెనే...

బోరింగ్ నైతె బొల్కు బొల్కున
కొట్టి కొట్టి సావాలె





## ఆఖరి మాట

"ఎల్లిపొతన్ననే లచ్చవ్వా
జర్ర పైలం ....పొల్ల గాండ్లను సవరియ్యి
ఉండ వశం లేదు
అప్పులోల్లు యములైంద్రే
రైతు బతుకే దినం గాదు
నేను ఎల్లిపోత...
బతుకుదామంటే బతుకనిస్తలేరు
మెతుకు లేని బతుకెందుకు
బ్యాంకోల్లు ఇజ్జత్ పజీత చేస్తంద్రు
అప్పులోల్లు మానం తీస్తంద్రు
నేనైతె ఇగ బతుక లచ్చిమి!
సొసైటియి ఇరవై నలబై అయినయట
యాబై వేలు షావుకారుకియ్యాలె
ఇంక ఆడీడ మస్తున్నయే
నా మీద నాకే ఒకారం పుడుతుంది
బతకంటే సిగ్గనిపిస్తంది

అప్పుల మీద మన్నువొయ్య
ఇంటిమీదికి రావట్టిరి
తొవ్వొంట అడుగవట్టిరి
బాయికాడికి రావట్టిరి
యాడికి పోయినా పీక్క తింటంద్రు
పచ్చి పులుసుకన్న పల్చనైన
ఏం జేతు ఎట్ల బతుకుతు
కాలం గాకపాయె
నీళ్లు లేకపాయె
కన్నీళ్ళు వటవట దునికె
చెర్లు ఎప్పుడో బోర్లేసినయి
బాయిలల్ల చెట్లు మొలిసినయి
బోర్లకే వల్మన్ని పైసలు.. పోత్తిమి
నన్నూరు ఫీట్లు పాతాళం లోతు
ఒక్కబోర్ల పదన లేదు
ఎల్లిన దుబ్బ సూసి నొసలు కొట్టుకుంటి
నలుగురు నవ్వే పనాయె!



బోర్ల కోసం ఎకురం ఎకురం అమ్ముకస్తి
మల్ల రేపటికి ఎద్దెట్లా? ఎవుసం ఎట్లా!
పొలగాండ్లు ఎట్లు బతుకుడు
ఇగ వానలు రావు - కరువు కాటకాలు పోవు
నీళ్ళూరావు - కన్నీళ్ళు పోవు
చేన్లు మాడిపాయెనే
కాలం గూడ కిందిమీదైంది
నాట్లేసినప్పుడు సుక్కలేని వాన
కోతకచ్చినప్పుడు ఇరుగ దంచె
ఉన్న నాలుగిత్తులు నీళ్ళ మునిగి
నోట్లకచ్చె మెతుకులు కాట్లెపడ్డయి
పత్తి పండిద్దామని నిండమునిగితిమి
అంతా పురుగు... రోగం
ఇత్తునాల నుండి మందుల దాక
మోసం... మోసం... పచ్చి మోసం
యాడ సూడబోయినా
ఎవుసాయదారుని నెత్తిల చెయ్యి పెట్టుడె
అంతా లుక్సానా... లోపటికపుడే
దోడ్... దోడ్... ఎద్దెం... ఎద్దెం...
ఎన్నేండ్లు చేసినా ఎవుసం
రూటికి రాదు రుంగానికి రాదు

అందరు పెరగపట్టిరి
రైతులు సావవట్టిరి
నేను సుత సావు పడుతున్ననే

ఇగ నేనుండ
ఎల్లి పోతన్ననే లచ్చవ్వా
ఈ కరెంట్ రేట్లు ఎవ్వడు పెంచె
బక్కోడు ఎవుసాలు బంద్ పెట్టాల్నా ఏంది
ఎవనికి జీతం ఉండి బతుకాలె
ఏడ పడి ఏడ సావాలె...
తెచ్చిన అప్పులెట్ల గడుదు
నన్నమ్మినా తేరుతయా
ఉన్న దొయ్యలు అమ్ముదునా
కరువు కాలం ఎవ్వడు కొనాలె
బతుకు తండ్లాట గిట్లుంటే
బల్సినోని మాటలు ఇన్నావా
'తిన్నదరగక సస్తండ్రట'



కొడుకా నీవు తినే గింజలెక్కడియిరా
హిస్టీరియా రోగాలని ఇంకొకడు అనవట్టె
ఎవుసాన్ని రోగం చేసిందెవ్వడు
ఎవుసాన్ని నక్కి దువ్వ చేసిందెవలు
ఎవలకు పెరిగినయిరా బొర్రలు
లోపలికి పోయిన దొక్కలు కనపడుతలేవా
అన్నం పెట్టెటోడు రోగి అయ్యిండా
పెయ్యికి చెటాక్ మాంసం లేదుర బిడ్డా
వడ్లు పండిచ్చి దేశానికి బువ్వపెట్టినం
మాకే బువ్వ లేకుంట చేస్తిరి గదర

ఎక్స్‌గ్రేషియా కోసమే సత్తండని అంటండ్రు
వాల్లు ఎంత మాట.... ఎంతమాటంటండ్రు
చూసినావా! లచ్చవ్వా!
ఈ మాటలే తూట్లు పొడుస్తున్నయి
నీ పైసలెవనికి కావాలెరా!
గోవులసోంటల్లం అంతమాటంటారు?
గోస తలిగి సస్తరు మీరు
అప్పులెగబెట్టి ఎటన్న పోయేటోల్లం కాదు

ఆత్మగల్లోల్లం... అభిమానం ఉన్నోల్లం
ఇక్కన్నే సావనైనా సత్తం
ఇక్కన్నే మల్ల పుడుతం
గంగసోంటి బతుకులు బతికినం
నిండ మునిగితిమి
అప్పులోల్లు యములైండ్రే
నేనుండ... నేనుండ... ఎల్లిపోతున్న

........................

లచ్చువ్వా!... లచ్చువ్వా!
గట్లరంధి పడుతన్నవెందుకే
అడుక్కున్నట్లు అనువం ఉంటది
రాశున్న కాడికి బతుకుత
కొంటపోయినప్పుడే పోతన్న

........................

నూకలు అయిపోయినయి...
సర్కారోడు సచ్చినంక ఇచ్చే పైసలు
అస్సలు తీసికోకే లచ్చువ్వా!
వాడు తిన్నది అరుగక సత్తండ్రు అన్నడు గదా!



వాని మీదనే పెట్టుకోని సావనియ్యి
వాని రాజ్యం ఇంట్ల మన్నువొయ్యి

నేనెల్లి పోతన్న...
నిన్ను అన్నాలం చేత్తన్ననే లచ్చా!
పోరగాండ్లకు దిక్కు సక్కి లేదు
అప్పులోల్ల బాధకు...
ఎల్లిపోతన్న... ఎల్లిపోతన్ననే......"

13-6-2004

* నేటినిజం దిన పత్రిక
20-8-2004





# ముచ్చెమటలు

అన్నన్నా... జబ్బకున్న తుపాకీ
జర్ర సందుగల పెట్టే
లఢాయి ఎనుక శిక్కిగానీ
ముందుగాల ముచ్చెట పెట్టు
తెగే కొట్లాట కాదు
వొడిశే పంచాతి కాదు
భూమికోసం లొల్లి
భూమి పుట్టిన్నుంచి ఉన్నది
పోరాటం పోరాటమే

* * *

రోజు కోపెడు కన్నీళ్ళు
తాగే ఖాకీ ఓ ఖాకీ...
ఇక నుంచి
రోజూ తెల్లారి బూస్టుపాలు తాగే

* * *

తుపాకులు పూలు పూయాలి
తూటాలు మాట్లాడాలి
పావురం పంజరం వీడాలి
ఊరూ అడవి ఒక్కటవ్వాలి

13-7-2004

* ప్రజాతంత్ర వార పత్రిక
జూలై 18-,24, 2004






# బురద కాళ్ళకు సలాం

పొలం ఇరువాలు మూడుసాల్లు దున్ని
మానెడె గింజలు మడిలో పోసి
పుట్టెడు వడ్లు పండించిన ఓ రైతన్నా!
నీ బురుద కాళ్ళకు సలాం

అన్నం తినే కంచం నిండా
నిత్యం నీ శ్రమ జీవన ఫలం మెరుస్తుంది

రైతన్నా! ఓ రైతన్నా!! నిన్ను
బుక్కబుక్కకూ యాజ్జేసుకుంటమే
దయాదాక్షిణ్యం లేని వాన చినుకులు
బాయిల్లో అడుగంటిన నీటిమట్టం
కరెంట్ కోతలు, పెరిగిన ధరలు అప్పుల తిప్పలుతో
ఎండిపోతున్న పచ్చని బతుకులు

నారుమల్లలో పత్తిచేనుల్లో
విచ్చుకుంటున్న అప్పుల విషవలయాలు
రైతాంగ కుత్తుకలు  కత్తిరిస్తున్నాయి
కోట్లకుకోట్లు ముంచిన కృషీ బ్యాంక్
ఖుషీ ఖుషీగానే ఉన్నది చూడు



దేశదేశాల్లో దేశాన్ని తాకట్టుపెట్టినవాల్లు
నేల నేలనంతా అప్పుల మయం చేసినవాల్లు
దర్జాగనే బతుకుతున్నరు చూడు
అప్పుల ఊబిలో దిగిన ఓ రైతన్నా!
వేలాడుతున్న ఉరితాడును కొడవలితో కొయ్యి
పచ్చని పంటకోసం పుట్టెడు అప్పులు కావచ్చు
ఆగం ఆగం కాకు... ముల్లును ముల్లుతోనే తియ్యి
ఇగురంగా బతుకు

1-8-2004

* 'ఆంధ్రభూమి' ఆదివారం
10-10-2004
* 'జీవగడ్డ' పక్ష పత్రిక,
ఆగస్టు 15-30, 2004

## పోట్రవుతు

ఊర చెర్ల ఈత గొట్టంగ
పురుసాలకు జనిగ బట్టినట్లు
పుక్యానికి కరెంటని ఏతులు కొట్టిరి
అక్రమ కనెక్షన్లని ఇప్పుడు బొండిగ వట్టిరి



కమ్మగ నములుతున్న గుడాలల్ల
పంటికింద రాయి తగిలినట్లు
'తుపాకుల సంగతేంది' అని మల్లనుడేంది
అతారెలు ఉంటేనే 'అన్నలు' గద!
గందుకే 'ముచ్చట్లాయె'

పానాది పొన్న బిర బిర నడవంగ
తాకిన ఏలుకే దెబ్బ మీద దెబ్బ తాకినట్లు
తెలంగాణా రాజిర్యానికి
ఊకె పోట్రతువులు తలుగుడేందర బై...
ధూత్... తెరి నాకు సమజ్ అయిత లేదు
యాడ సుడబోయినా
ఎత్తుకొల్లు మొత్తుకొల్లు

28-8-2004,

* 'నేటి నిజం' దిన పత్రిక,
11-11-2004





# ఏకాంతం

తలపోసుకున్న ఓనమాలు
ఏకాంతంలో పురివిచ్చుకొని
వాక్యాలు వాక్యాలుగా వ్యాపిస్తున్నాయి

ఒక పాఠశాల
సమాజ ప్రతిబింబం
సాముహికత వైరుధ్యాల కిరికిరి

తకెపెకలాడుతున్న మనస్సు
అధ్యయన సమయం
ఏకాంతంలో ఆలోచనలు
ధారలు ధారలుగా సాగుతుంటాయి



జెండాలై నిల్చిన జనం
అలుపు లేని తండ్లాట
అలవిగాని ఆత్మగౌరవ కొట్లాట

నడిబజార్ల నిలిస్తేనే అధ్యయనం
ఏకాంతం దొరికితేనే అవలోకనం
ఏకాంతం నిశ్శబ్దం
ఏకాంతం అంటే
ఏకాకితనం కాదు సమూహమే!

సెప్టెంబర్, 5 2004

* 2005 'పత్రిక' మన మాసపత్రిక
డిసెంబర్ 2004





# మంకమ్మతోట లేబర్ అడ్డా

పల్లె పొలిమేరలు దాటి
అడ్డా మీద సరుకుగా మారిన సందర్భం
అంగడిలో గొడ్డూ గోదా అమ్ముడు పోయినట్లు
నిలువెత్తు మనిషి
తనకు తానే అమ్ముకుంటున్న దృశ్యం

మంకమ్మతోట లేబర్ అడ్డా మీద
బక్క చిక్కిన దేహాలన్నీ
లొట్టబోయిన కండ్లతో చూస్తున్నాయి

పనికి తీసికోండ్రి సారూ...
కూలి తక్కువిచ్చినా వస్తం..
ఏదన్న పని... కావాలె... అయ్యా పని...

గోస గోస మాటలు
గోవుల్లాంటి చూపులు

సున్నం వేసే కుంచెలు
తట్టా పార, గడ్డపారలతో
పల్లె తరుముతె
పక్షులన్నీ అడ్డా మీద వాల్తాయ్

చెయి సంచిల సద్దిగిన్నె
జబ్బ మీద తువ్వాల
ఇంకో చేతిల అతారెలు



ఎవలు పిలుస్తరా! అని ఎదురుచూపులు
కంకర కొడుతరు కందకాలు తీస్తరు
భవంతులు కడుతరు బండలేస్తరు
గోడలు కడుతరు రాళ్ళు మోస్తరు
అరొక్క పనులన్నీ అవలీలగ చేస్తరు

నున్నగా తారు రోడ్డు పరిచి
కలల కూడా డ్రైవింగ్ చేయని వాళ్ళు
ఫోన్ లైన్ల కోసం కందకాలు తవ్వీ తవ్వీ
హలో అని పలకని వాళ్ళు
పాలరాళ్ళతో భవనాలెన్నో కట్టి
పూరి గుడిసెల్లోనే జీవించే వాళ్ళు
ఉస్నాద ఎములాడ సిర్సిల్ల...
చినుకులు కురువని పల్లెలు ఎల్లగొడితే
అడ్డ మీద కూలీలైరి

18-9-2004

* ఆంధ్రజ్యోతి, 'విద్యుల్లత'
16-1-2005

* 'రంజని కుందుర్తి' కవితాపురస్కారం 2004 కు ఎంపికైనది.





# మాట

పెదవుల నుంచి రాలిపడుతున్న
మాటల తరంగాలు
వికాసానికి కొలమానాలు

మాటలే గుండెల్లో అనురాగం కుమ్మరించేవి
కొన్ని కొన్ని మాటలే మనుషుల మధ్య విభజన రేఖలు

మాటలు హృదయాలను కెలికినట్లు కాదు
అందంగా అలికినట్లుండాలి

మాటలు గులాబీల్లా గుసగుస లాడాలి
సున్నితపు త్రాసుపై కొన్ని మాటలు వేసి
'మనిషితనాన్ని' తూకం వెయ్యచ్చు

మాటంటే మమతల మూట
అప్పుడప్పుడూ అది తుపాకీలోని తూటా
మాట్లాడటం వల్లనే కదా
పరస్పరం ప్రేమించేది లాలించేది ఎదిరించేది
ఎంతైనా మాటొక మంత్రం
మాట్లాడటం మహాతంత్రం

గావురం మాటలు - కావురం మాటలు
నెనరు మాటలు - పొగరు మాటలు
లాలి మాటలు - పాలి మాటలు



మన మాటలలోనే పొంచి ఉన్న శత్రువులు
మన మాటలలోనే అల్లుకునే స్నేహితులు
మాటలు అనందపు బాటలు కావాలి
మాట్లాడితేనే మనస్సుకు నిమ్మళం
మాట్లాడుకోవడం మనుషుల్ని కలిపే తీగ

26-09-2004

* 'ఆంధ్రప్రదేశ్' మాస పత్రిక
డిసెంబర్ 2004






# తెల్లపాలన

గుండె నిండా పరాయితనం
ధమనుల్లో దేశీయత ఎట్లా ప్రవహిస్తది

పాలనా భాష నాది కాదు
పాలకుల్లోనూ నా సంభాషణ లేదు
ఆహారం ఆహార్యం ఏవీ నావికావు
సంస్కృతి అంతా వికృతం

తనువు తనువంతా
వశీకరణంలా పరాయీకరణం చెంది
దేహం సమస్తం కొయ్య బారిన తనం

సామ్రాజ్యవాదం మన దర్వాజ ముందు
ప్రపంచీకరణ మొకంపెట్టుకొని ఇకిలించిన్నాదే
దేశీయుత గుండె కలుక్కుమన్నది
బహుళ జాతులు భారతీయతపై కన్నేసి
సరళీకరణ కనుసైగ చేసిన్నాదే
దేశీయత దేహం నీరసం చెందింది



తెల్లవాన్ని తరిమి కొట్టినా
గ్లోబలైజేషన్ చక్కెర పూతతో ఇది తెల్లపాలనే
అంతా తెల్లభాష, తెల్ల సంభాషణ

6-10-2004

* 'చినుకు' సాహిత్యమాసపత్రిక
సెంబర్ 2005






# ఎండిన చెరువూ-నాలుగు యాదులు

బతుకమ్మ పండుగ్గొలె
రామ రామ రామ ఉయ్యాలో!
రామనే సీరామ ఉయ్యాలో!!
ఊరూ వాడా పాటల ఆటలు ఆడీ ఆడీ
బతుకమ్మలను చెర్ల నీళ్లల్ల సాగదోల్తరు

ఎద్దడి నేలపై పూసిన అడి బిడ్డలూ...
పుదిచ్చిన ఆ బతుకమ్మలను
ఇప్పుడు ఎక్కడేస్తరే!
చెర్ల నీళ్ల సుక్కుంటే ఓట్టు...
మన్ను మీన్నే బతుకమ్మ వాలి పోతంది

## 2

జీవునానికి ఈత రాపోతె ఉత్తదే
నాయన నాకు పానా పాణంగా
ఆన్పెకాయ బుర్ర కట్టి చెర్ల ఈత నేర్పిండు
నాకొడుక్కు సుత
ఈత నేర్వాలని తల్లిడిల్లుతున్న
పందేడ్ల సంది చెరువు బొత్తిలకు ఎండింది
మావోని పాదాలు మత్తడి నీళ్ళల్ల ఎగురనే లేదు

## 3

కట్టమీన కూకోని పదం పాడుకుంట
వాయిలి బరిగెల తోని చెర్ల జెల్లలు పట్టేది
ఇప్పటి కత్తు పోరగాండ్ల కైతే
గాలం తెల్వది... ఎర్రలు తెల్వయి
అస్సలు చెరువు నిండితే గదా!
పదం పాడుకుంట చాపలు పట్టుడు



## 4

'గణపతి బొప్పామోరియా' ఒర్రుకుంట ఎగురుకుంట
పూరంతా కలె తిరిగి జేకొట్టి జేకొట్టి
వినాయకున్ని చెర్ల నీళ్ళల్ల ముంచేది
ఇప్పుడైతే చెర్ల నీళ్ళెక్కడియి
బొందల గడ్డమీన్నే గణపతి కూకున్నడు

31-10- 2004
నడిరాత్రి

* 'నవ్య' వారపత్రిక
25-5-2005
* 'బతుకమ్మ... బతుకు' కవితాసంకలనం





## వ్యాకరణం

చరిత్ర పొడుగునా చమర్చిన కన్నీళ్ళు
గాయమైన పెయ్యి నుంచి కారుతున్న నెత్తురు
ఏండ్లకు ఏండ్లుగా సుడిపడుతున్న జీవితం
అయినా ఎక్కడా నా పేరు ఎక్కలేదు
పేజి పేజీల్లోనూ నేను గయాబ్
జనం నొట్లెకె ఊడిపడ్డ పదం
నిఘంటువుల పదఘట్టనలో నలిగి పోయింది

ఏ పదబంద ప్రబంధం లోనూ
నా యాస లేదు బాస లేదు
వాక్యం నా పలుకు పల్లించదు
అక్షరాల్లో నా నుడికారపు శబ్దం లేదు

నా భాషనే అంబుక్క పెట్టిన నీవు
జీవశ్వాసను బంధిస్తున్నట్లే
లెక్కల్లోనూ అన్నీ పొక్కలే
భాగ ఫలం సమభాగం కాలే
విభాజ్యం వివక్షకు విభాగినీ వంత పాడింది
సర్వేల సారం నిండా నా మూగ స్వరమే



ఆట మాట పాట కాట గలిసి
తెలంగాణ సంస్కృతి తెర్లయింది
నేను గా మొలకెత్తిన నేను
నేను గా ఎదిగి నేనుగానే జీవించాలి
పద పదంలోనూ నా నాదం విన్పించాలి
ఇక నుంచి నేను
కొత్త వ్యాకరణంతో వాక్యం రాసి
కొత్త గుణకారంలో లెక్కలు తీస్తా

18-11-2004

* 'ప్రజతంత్ర 8వ వార్షికోత్సవ ప్రత్యేక సంచిక'
5-11, డిసెంబర్ 2004






# గ్లామర్

మన్ను ఎన్నడూ అంటకున్నా
కవిత్వం నిండా మట్టి వాసన కమ్ముకుంటంది

దేహం స్వేదంతో తడిసి పోకున్నా
రాతల నిండా శ్రమ జీవుల పదాలు తేలిపోతయి
జనంలో లీనమై జీవించ కున్నా
మాటల నిండా ప్రజలు ప్రజలని వల్లింపులు
జెండా ఎత్తి జైకొట్టింది లేదు
ఉద్యమాల ముచ్చట్లు ఊకదంపు ఉపన్యాసాలు
జైలు గోడలు తడిమిందీ లేదు
నిర్బంధం గూర్చి కలవరింతలు

పుట్టిన పుట్టుకా వేరు
పెరిగిన జీవితమూ వేరు
కష్టం లేదు కన్నీళ్ళు లేవు
నినాదమై నినదించిందీ లేదు
మాటలొకటి చేతలొకటి
అంతా వొల్లెక్కల ముచ్చట
అంతా కట్టుపండ్ల నములుడు
ప్రజల గ్రామర్ విడిచిపెట్టి
గ్లామర్ కోసం విప్లవం పులుముకునుడు

2-12-2004,

* ఆంధ్రప్రభ సాహితీ గవాక్షం
3-1-2005






# చర్చలు

భయం భయంగా కునుకు తీసే పల్లెలు
ఆరేడు నెలలుగా
గుర్రుకొట్టి నిద్రపోతున్నాయి
ఉరుములు మెరుపుల విరామంతో
ఆకాశం నిమ్మళమైంది
అగులు బుగులు లేని మబ్బులకు
చందమామ సోపతే సోపతి
పల్లె నిండా పండు వెన్నెల వెలుగు
కల్లోలం లేదు కన్నీళ్ళులేవు
ఎదురులేని కాల్పులు లేవు
ఒక్క పత్రికా నెత్తురు మరక మోసుక రాలే
ఆయుధాలన్నీ ఇట్లా మౌనంగానే ఉండాలి
మౌనం మూగతనం కాదుగదా!
తుపాకీ బ్యారల్ మీద
పావురాలు కాపురం చేయాలి

21-12-2004
ఎగిలివారంగ

* నేటినిజం,
3-2-2005

## II

మళ్ళీ
పచ్చి పుండై సలపరిస్తున్న పల్లె
కన్నీళ్ళ సాన్పుతో తడిసిన వాకిల్లు
నీళ్ళింకిన వాగులో నెత్తుటి ధారలు
పల్లె పల్లె అంతా తల్లడం మల్లడం

వేటగాడు వేట మానలే
మాట నటించి మాటు వేస్తున్నాడు

మళ్ళీ కమ్ముకున్న తుపాకుల మేఘాలు
మళ్ళీ మృత్యుదారులు మృతశిరస్సులు

కంటినిండా నిద్రిస్తున్న ఊరిలోంచి
హృదయాన్ని ఊడదీసి 'ఖైమా' కొడుతున్నాడు



ఊరు ఇప్పుడు రక్తం మడుగు
ఊరు ఇప్పుడు కన్నీళ్ళ కొలను
ఊరు ఇప్పుడు ఉరికంబపు తాడు

ఎనిమిది నెలలుగా మురిసిపోయిన పావురం
కడుపులోని కపటానికి నేలరాలింది

రాజ్యం అంటే రాజ్యమే మరి
బలగాలు అవే బందూకులూ అవే
మారింది రాజు గాని రాజ్య స్వభావం కాదు

ఊరి ఆకాశంలో
ఉసురు మేఘమై ఉరుమురుతంది

22-1-2005

* 'నేటినిజం' దిన పత్రిక
3-2-2005
* 'జనకవనం-2' సంకలనం

## సునామీ

సముద్రం నిప్పుల ఉప్పెన
సముద్రం బుసకొట్టిన విషనాగు
మహాసముద్రం మొత్తం మృత్యుహేల

సల సలా మసులుతున్న సముద్రగర్భం
సుమత్రా దీవుల్లో బ్రద్దలైంది
మహా విస్ఫోటనంతో అలలు అల్లకల్లోలం
కత్తులవలె ప్రాణాల్ని తీస్తున్న అలలు
నిలువరించలేని అగ్ని కీలలు
సునామీ సృష్టించిన సిస్మిక్ కదలికలకు
ఇండోనేషియా నుంచి ఇండియా తీరం వరకు
హిందూ మహాసముద్రంలో మృత్యువు నవ్వింది




శ్రీలంక థాయిలాండ్ మాల్దీవుల
ద్వీపాలన్నీ గజ గజ లాడినయ్
ఆంధ్ర ఒరిస్సా తమిళ బెంగాల్ తీరం అంతా
తీరని వ్యధలు ఆరని మంటలు
అండమాన్ దీవుల్లో
సెంటినల్ మానవ సంతతి అంతమయ్యింది

ఎటు చూసిన శవాలు శవాలు
పసిపిల్లల నుంచి పండు ముసలి వరకు
అన్నీ కోల్పోయిన వాళ్ళు అందరినీ పోగొట్టుకున్నవాళ్ళు
రాశులు రాశులుగా రాలి పోయిన దేహాలు
రోదనలతో హృదయాలూ రాలిపోతున్నాయి
సముద్రం ఎంత గంభీరమో అంత విధ్వంసం

సునామీ! ఎంత గంభీరమో అంత విధ్వంసం
రిక్టర్‌స్కేల్ పై భగ్గుమన్న భూమితో
మహాజలం మృత్యుతరంగమైంది
లక్షల మందికి శోకం మిగిల్చింది
గుట్టలు గుట్టలుగా అలలపై
తేలుతున్న మృతదేహాలు

జనవరి 1, 2005

* 'ఆంధ్రప్రభ సాహితి',
17-1-2005

# కొన్ని నానీలు

శాంతి కోసం
చర్చల మీద చర్చలు
ఎదురు కాల్పుల్లో
చర్చలు హతం

ఏడు నెలలు
పల్లె కంటి నిండా నిద్ర
ఇగసూడు
మోతమీద మోత

ఇన్ఫార్మర్ గజగజ
సింపతైజరూ గజాగజ!
తూటాల బలబల
తెలంగాణ గిలగిల



నిద్ర నటించిన
తుపాకులు మొరిగినయ్
నిద్రపోయిన
మందుపాతర మేల్కొంది

నీళ్ళులేక
చెర్లు బాయిలు ఎండినై
వాగుల్ల వంకల్ల
నెత్తురు పారుతంది

2-2-2005





# అతుకని పోగు

ఇక్కడ ప్రాణం వొక నాడె
కొట్టుకోని కొట్టుకోని
ఎప్పుడు నిలిచేది తెలువది

వేయి తలల యంత్ర కోరలకు
చేనేత మగ్గాల చేతులిరిగె

పాక చెక్కల కింద అణగారిన
శాలల జీవితాలన్నీ
నెత్తురు స్రవిస్తున్న గాయాలు

కండెలా ఉండ చుట్టుకున్న
ఎండిన పేగుల రోదన
ఎదమీద నొప్పి ఎప్పుడూ వేదన

దగ్గు దమ్ము ఆయాసం
నెల పొడుగునా రోగాలే

పెయ్యికి చటాక్ మాంసం లేదు
కీసల పచ్చనోటు ఎన్నడూ లేదు

సంసారం తెగిన పోగు
ఎంత అతికినా గతికిరాదు



పోరని తనంనుంచి సావుదల దాకా
మగ్గం నేసుడే ప్రపంచం

వెయ్యిల మీటర్ల బట్టనేసినా
నాలుగు వేళ్లు నోట్లెకు రాలే

బతుకంతా మొగ్గం గుంటలో
పాతరేసుకున్నా
జీవిత వృక్షం చిగురించలేదు

27-7-2005

* ఆంధ్రభూమి, ఆదివారం
24-4-2005

# బస్సు

ఒకానొక లౌకిక లోకం
ఒక ఊరు ఒక తాండ ఒక పట్నం
సమస్త వ్యక్తిత్వాలను ఏకం చేస్తున్న వేదిక
'అంటుడు ముట్టుడు' రూపుమాపి
ఆది నుంచి అందరిని కలిపిందీ ఎఱ్ఱ బస్సు

ఒక్కలా  ఇద్దరా!
ఊరికిద్దరు... ముగ్గురు... పదిమంది
కులానికొకలు తలానికొకలు
నిత్యం ఎందరెందరినో
మోసుక పోతున్న బస్సు
సమానత్వ సూత్రానికి సిసలైన ప్రతీక

కదిలిపోతున్న వాహన సంసారంలో
అమ్మలు అవ్వలు తాతలు బాపులు
సంటి పోరగాండ్లు సంక పిలగాండ్లు
వయిసు వయసోల్లు గడుసు పోరలు
అందరూ తీర్పాటంగా కూర్చొని
ముచ్చెట్లన్నీ... నడుస్తున్న బస్సులోనే
సామాన్లన్నీ ఇల్లునిండా పరుచుకున్నట్లు
సంచులు సందుగలు బుట్టలు బట్టలు



బ్యాగులు బస్తాలు బిస్తర్లు
బస్సులో అన్నీ ఎక్కడివక్కడ సర్దుకున్నాయి

కిటికీ ప్రక్క
ఆలోచనా పావురాలు రెపరెపలాడుతాయి
దృశ్యాదృశ్యాలు
మనస్సు పొరల్లో క్లిక్ మంటాయి

కొందరికి బస్సు నిద్రపాన్పు
కొందరికి పఠన సమయం
ఒక్కోదిన పత్రిక పది ముక్కలై
వరుస వరుసకూ తిరుగుతుంది

లేనోల్ల లోగిలి
కలిగినోల్ల వాకిలి
నడుస్తున్న చల్లని చెట్టు
ఉరుకుతున్న ఇల్లు
గంటలకు గంటలు
మనల్ని కలిపి ఉంచే కరచాలన స్పర్శ
బస్సు మానవ జీవన యానం

* * *

పగుంటే కూల్చేటోన్ని కూల్చుకో... కాల్చుకో...
బంగారం అసోంటి బస్సేమన్నది...

13-3-2005

* ఆంధ్రభూమి ఆదివారం
24-7-2005






# పొలిగోలిగ

కరుకుగీరెల ఇనుప శకటాలు
పంట పొలంలోకి జొరబడ్డాయి
యంత్రీకరణ కుతంత్రాలు
ఇంటింటికీ చేరిపోయాయి
పల్లె విధ్వంసం రైతుకూలీ విధ్వంసం

పచ్చని పల్లె పల్లెకూ వ్యాపిస్తున్న
ఒక్కో 'హార్వెస్టర్' యంత్రం
వందల కూలోల్ల పొట్టలు కొట్టింది
నాట్లేసి కలుపుతీసి కోతకోసే
తల్లులందరి రెక్కలు కత్తిరించింది

మక్కలు కందులు వరి పంటలన్నీ
ఒలుసుడు నూర్పుడు 'త్రెషర్'పనే
పంటనూర్చే ఈ యంత్ర దయ్యం
కూలీలందరినీ ఊర్చుకు తిన్నది

కరుడు కట్టిన కులస్వామ్యం
నెనరు లేని యంత్రాలు
కొడవండ్లు నాగండ్లను బలిగొన్నవి

ఇకనుంచి పొలంగట్ల మీద
జనపదాలు జాలువారవు
'పొలిగోలిగ' రాగం రాదు
అంతా యంత్ర భూతాల రొద



ఎకరాలకు ఎకరాలు
పంటకోసి పంజగొట్టి
బంతికట్టి గడ్డితీసే పనులన్నీ
యంత్రాలతో చేయిస్తే
కునారిల్లుతున్న కూలీలంతా
రెక్కలు కట్టుకొని ఊరిడిశి పోవుడే

ఊరికి ప్రొక్లెయిన్ వచ్చిన్నాడే
కూలోల్లు రాలిపోవుడు సురువయ్యింది

ఎద్దు నాగలి బక్కెవుసం
బొక్కబోర్లా పడ్డది
ప్రపంచీకరణ పడగ నుంచి
రైతుకూలీల బతుకులో
విషం చిమ్ముతంది

22-3-2005

* 'ప్రజతంత్ర' ఉగాది ప్రత్యేక సంచిక 2005
ఎప్రిల్ 10-10, 2005





## సౌక్యం

మాటలు నేర్చిన బాల్యం నుంచి
మనిషి చివరి అంకం వరకు
భాషలో కల్సిన యాస సంభాషణ
బతుకు పొడుగూ పొదిగిన ఆభరణం

మాట్లాడే భాష సొక్కం బంగారం
యాస మాట రామసక్కదనం
పలుకుబడి జన జీవనాడి
అమృతమయం మా అవ్వభాష
మెరుస్తున్న వజ్రకిరీటం నా యాస బాష

పుట్టిన పుట్టుక పెరిగిన నేల
వారసత్వంగా వస్తున్న సంస్కృతి
జీవన గమనానికి విషయసూచిక

మట్టిపై మమకారం కొందరికైతే
వట్టి విరామ పోతులు మరి కొందరు
శ్రమజీవన నేపథ్యం లేనివానికి
యాసా సౌందర్యం ఒంట పట్టదు
వాని కలం నిండా మార్మికతా కంపు
మాటల కోటలైతే మరీ ఎక్కువ



అవును పీడితుల భాష
పీడకుల భాషా వేరు వేరే...
ఉగ్గు పాలతో నేర్చిన మాటలు
ఊరితో పెనవేసుకున్న సోపతులు
పనితనపు చెమట బిందువులు
మహా మట్టి మనిషికి సంకేతాలు

25-3-2005

* వార్త, ఆదివారం
29-5-2005

# పట్నంలో పల్లె

ఊరు సూర్యుడై ఉదయించనిదే
నగరానికి తెల్లవారదు
పల్లెనుంచి పిండుకున్న పాలతోనే
పట్నం చాయ చప్పరిస్తది
పట్నం జీవనాళల్లో ప్రవహించేదంతా
పల్లెటూరి శ్రమ పరిమళమే
పట్నం నాకెప్పుడూ పరాయిదే

ఆకాశంలో నక్షత్రాలు కన్పించకుండా
అంతస్తుల మీద అంతస్థుల నిర్మాణాలు
నేలపై కాలు మోపనివ్వని
కాంక్రీట్ రహదారులు సిమెంట్ వాకిల్లు
ఇక్కడ కురిసిన వర్షం చినుకులు
భూమిలోకి ఇంకవు
పచ్చని మొక్కనైనా నాటుదామా అంటే
ఎక్కడ గింత జాగ దొరకదు
ఎప్పుడు హైమాస్‌లైట్ల కిరణాలే గానీ
చల్లని వెన్నెల వెలుగు చూసింది లేదు



అక్కడ అందరికీ అందరు తెలిసినా
ఇక్కడ కడప దాటితే
ఎవరికెవరు తెలువది
పక్కవాళ్లనన్నా పలకరిస్తామంటే
'కుక్క ఉన్నది జాగ్రత్త' హెచ్చరిక

సహజీవనం నుంచి
దూరమైన నాకు
పట్నం ప్లాస్టిక్ పువ్వు

రైతుబజార్ల కూరగాయలమ్మే కనకమ్మ
తెల్లారకముందే పాలు తెచ్చే మల్లయ్య
లేబర్ అడ్డామీద నిలబడ్డ రాజిరెడ్డి
ఎర్రబస్సుల కనపడ్డ ఎలమంద

వీళ్ళు కన్పించినప్పుడల్లా
నిత్యం నేను
పట్నంలో పల్లెను చూస్కుంట

2-4-2005

* మన తెలంగాణా (త్రైమాసిక)
బులిటెన్-2, సెప్టెంబర్-2005,
* దట్స్ తెలుగు డాట్‌కామ్

## భాస్వరం

యాడినుంచో రెక్కలు కట్టుకొని
నా నేల మీదికి ఎగిరొచ్చి
యాభై ఏండ్లుగా
పాడేది ఎవనిపాట

మా గాలిని పీలుస్తూ
మా యాసను ఒకారిస్తావు
మా నీళ్ళు తాగుతూ
మమ్మల్నే ఎక్రిస్తావు



అవ్వా! ఇటెటు రమ్మంటే
ఇల్లే నాదంటావే తల్లీ!
తిన్నింటివాసాలు లెక్కపెట్టి
మా హైదరాబాద్‌నే చెరబడుతున్నారు

సదువులు కొలువులు కొల్లగొట్టి
నీళ్ళుసుత మలుపు కొంటిరి
మాతాన బతికి
మాకే ఎసరు పెడుతరు
తల్లీ మీకు మాకు ఇగ కలువది
జై 'అలగ్' ఉంటం
మీ అంటు సొంటూ వద్దు
మీ సోపతే వద్దు అవ్వా!

నిజంగానే పోపొమ్మని
కసురుతలేము గాని
ఇక్కడ ఉండుకుంట అక్కడి
పాటపాడితే ఊకోము

ఒక దేశంగా బతికిన రాజ్యం
తెర్లు తెర్లయిన వైనం మాట్లాడితే
రాజకీయమానే అవ్వా!
దోపిడీ ముడి ఇప్పి చెప్పితే
రాజకీయ రాక్షసమా! తల్లీ

అవ్వా! ఒక్కనాడన్నా!
మా మట్టి భాషను ప్రేమించావా
ఒక్కరోజన్నా
ఎండిన చెరువు చూసి
తల్లడిల్లిపోయావా!
ఒక్క పూటన్నా!
నెత్తురోడిన మందారపూమోము చూసి
కన్నీరు కార్చావా
అసలు ఎప్పుడైనా
ఈ మట్టిలో పులకరించావానే తల్లీ!
పుటుక అక్కడిది
బతుకు ఇక్కడిది
పాట అక్కడిది

అవ్వా
అలగ్ అలగ్ అంటే
ఇల్లు ఒక్కటేనే!
కుండనే వేరు
దేశం ఒక్కటే
రాష్ట్రాలు వేరువేరు

(ప్రజతంత్ర వార పత్రిక 17-23 ఏప్రిల్ 2005లో
తురగా జానకిరాణి 'విభిన్న స్వరం' కవితకు స్పందించి)
25-4-2005

* ప్రజాతంత్ర వార పత్రిక ఏప్రిల్ 24-30, 2005



# ఇల్లుమారుడు

ఇల్లు మారుడంత తిప్పల
ఇంకేముండదేమో
మనసంతా ఎల్లిపోతున్న బాధ
తనువు నిలువెల్లా నిండిన దుఃఖం
ఖాళీ చేసి సర్దుకున్న
రెండు మూడు రోజులు నిద్రరాదు
ఇల్లాలి కష్టాలైతే
చెప్పరాదు రాయరాదు

అమర్చిన సామానులన్నీ
బహుభద్రంగా కొంటపోవుడు
కొత్త ఇంటినిండా అమర్చుడు
పిల్లలకు మాకూ
ఇది దుఃఖం వచ్చేంత పనే

పిల్లి తన పిల్లలతో
ఏడిండ్లు ఎట్లా మారుతుందో గానీ
మాకు మూడిండ్లకే మొసకచ్చింది

వస్తువులన్నీ దులిపి సర్దుతాంటే
మరిచిపోయినయి మళ్ళీ పలకరిస్తాయి
పోయిందను కున్న పుస్తకం
తాళం చేతిల గొలుసు పాత ఫోటో
అన్నీ దొరికి ఆనందం కల్గిస్తాయి
పాత వాటి జోలికి పోయామా!
దుమ్ము ధూళి బూజు నిండిపోయి
ఒక్కటే దగ్గులు తుమ్ములు
ముక్కు పొంట కారుడు

ఖాళీ చేస్తున్నామంటే
చుట్టూత స్నేహాలను వీడుతున్నామా
ఆప్యాయతలను తెంచుకుంటున్నామా
అప్పుడప్పుడు వచ్చి పొంద్రంటూ
ఆహ్వానాలు అప్పుడే అందుకుంటాము



మొగోల్లం ఎంత కంతే
గంభీరంగానే పలకరించు కుంటాం
ఆడ వాల్లైతే వదినమ్మా వదినమ్మ అని
సాన్నిహిత్యం ఒలకబోసుకుంటారు
పిల్లలు కూడా వాల్ల ఫ్రెండ్స్‌తో
విడి పోతున్నామన్న దీన ముఖం

వాడనిండా
అందరం మాట్లాడుకోకున్నా
కనులతోనైనా కరచాలనం చేసుకునేవాల్లం
ఊరినుంచి నగరం మారడం
నగరంలో వాడ మారడం
తలుపు సందుల చెయ్యి ఇరుకడం

29-4-2005

* 'నేటినిజం' దినపత్రిక
24-7-05

# అగిర్త

తెల్లారంగానే కిచకిచలాడే
ఊర పిశ్కలు యాడికి పోయినయే!
అవ్వి సుత నీళ్ళు లేక
ఊరిడిశి ఎల్లి పోయినయా

మ్యాకలు గొర్లను మేపుదామంటే
గర్కపోస లేదు నీళ్ళతావు లేదు
అడ్డికి పావుశేరు అమ్ముకుంటే
దుక్కం రావట్టిందిర బిడ్డా

గోదలకు మ్యాతేది నాయనా
ఎంత అవుగోలిచ్చినా
బక్కెడ్లు బతికే దినం గాదు
అంగట్ల కోతకెట్లా కొట్టాలె తండ్రీ!



మనిషంటే ఉన్న కాడికి పోతడు
ల్యాగలు దుడ్డెలు నోల్లు దెర్శె
కోడి పిల్లల మెడలు యాలాడినయి
కుక్క కూనలకన్నా నీళ్ళు లేవు

కాకులు కొంగల జాడ పత్త లేదు
పావురాల పలుకులు లేవు
ఎండిన ఊర్లల్ల
గబ్బిలాలన్న కన్పిస్తలేవు

చెర్లు కుంటలు నెర్రెలు పడి
బాయిలు బోర్లు బొత్తిలకు పోయినయి
సుక్కనీళ్ళ లేని పల్లెలల్ల
బతుకులు ఎట్లా ఎల్లుతన్నయో ఎరికేనా సారూ

సుర్క్ సర్క్ మనే శక
రోకండ్లు పల్గొట్టే ఎండలు
ఒక్కటే అగిర్త... మంటలు పోట్లు
భూమికి మనుషులకు

25-5-2005

# అయితే ఏంటంట

అవును ఇప్పుడు
చింతన అంతా పులిచింతనే
పోలవరం పలవరింతనే
ఏడ్చేవాల్లు ఏడ్వనీ!
వ్యతిరేకించే వాల్లూ వ్యతిరేకించనీ...
అయితే ఏటంట



అక్కడ మూడో పంటకు నీళ్లిస్తా
ఇక్కడ మూడు కాలాలకు
కన్నీళ్ళు పారిస్తా
మళ్ళీ చెప్పుతున్నా
చింతన అంతా పులిచింతనే
కలవరింతా పోలవరమే

నేలంతా
సస్యశ్యామలం చేస్తామన్నాం
షరతుల్లేని చర్చలన్నాం
ఉచితానుచిత విద్యుత్ అన్నాం
రైతు రాజ్యం... రైతురాజ్యం
అని కలవరించాం
అయితే ఏంటంట

కుర్చీకోసం ఎన్నో అంటం
ఓట్లుపడేదాక ఒడ్డున చేరేదాక
రాజదండం చేతికొచ్చేదాక
ఎన్నోఅంటిమి ఎన్నోమాట్లాడితిమి
అయితే ఏంటంట

3-7-2005

* ఆంధ్రప్రభ, సోమవారం
12-9-05

# రుమాలు

తల రుమాలు ఇప్పుడొక
తడారిన జ్ఞాపకం
ఒకప్పుడది శిరసెత్తిన పతాకం
తల వంచని విశ్వాసం
పల్లె తనపు గాంభీర్యం
మనిషి మనిషి కది తలమానికం

నెత్తిన రుమాలు సుట్టుకొని
ఎర్రటి ఎండల ఎంత తిరిగినా
ముచ్చిల గుంటల చల్లన
శీతాకాలం రాత్రుల్లో ఎంత సంచరించినా
చెవుల కింత వెచ్చన
ముసురు వానల నడిచినా
నెత్తి తడువది వణుకు పుట్టది

తెల్లరుమాల్ నల్ల రుమాల్
అంచు రుమాల్ ఎర్ర రుమాల్
ఏ అయిదు మూరల బట్టైనైనా
నెత్తిన చుట్టుకుంటెనే సాంత్వన

రుమాలు మడతలలో
పొగాకు సుట్ట చెక్కుకొని దాసుకోవచ్చు



కాలెక్కలు మొకం కదుక్కున్నప్పుడైతే
అదొక తువ్వాల

అలిసిపోయిన శరీరం
ఓ చెట్టు కింద సేద తీరితే
అది నెత్తి కింద మెత్త

శిలక్కొయ్యను చూస్తేనే తెలుస్తది
తాత ఇంట్లున్నడా లేదా అనేది

చెరువు కట్టన వూడుగు చెట్లకు
ఆరేసిన రుమాలును చూస్తిమా
తాత తెల్ల మీసాలకెల్లి
ముసి ముసి నవ్వు గుర్తుకస్తది

బోడ నెత్తితో కనపడితే ఉత్తోడే
రుమాలు పేల్క సుట్టుకుంటెనే మనిషంటరు

కాళ్ళకు కిర్రు చెప్పులు
భుజం మీద తెల్ల కండువా
నెత్తికి రుమాలు
జాతి సహజాతాలు

5-7-2005

## పాముసోపతి

పాము సోపతి పడగ నీడ
ఎన్నొద్దులు ఇంకెన్నొద్దులు
పాము ఎన్నటికైనా పామే



అది ఇసప్పురుగు
రెండు కోరల పాము
రెండు తల కామల పాము

సూస్తన్నవు గదా!
ఎంత పొడుగు కూసం
ఎంతెంత మోసం
ఓ నాలిక ఏకాభ్రిపాయం
ఇంకోనాలిక రెండో ఎస్సార్సీ
లేదా అంతా ఆమిష్టం
ఎన్ని మెలికలు ఎన్ని మలుకలు
ఎన్నెన్ని మెలుగులు

చరిత్ర కమ్మలు మర్లేస్తిమా
కమ్మ కమ్మలో
కమ్ముకున్న ధగా కన్పిస్తది

బల్సిన కోడెకు బక్కెద్దుకు
పొత్తుపొసగదని
ఫజల్ అలీ ఫైస్లా చేసినా
ఇత్తేసి పొత్తు కూడింది
ఈ పాముల సంతతే

నీట్కంగ దోసుక తినుడు
నాటకం తో నీళ్ళు మలుపుకునుడు
ఉషారుగ కొలువులు కమాయించుకునుడు
సహించక కన్నెర్ర చేసిన కాలం

గోబ్యాక్ గోబ్యాక్ గోంగూర పచ్చడి
రణ నినాదంతో నినదించి నినదించి
మూడు నూర్ల పోరలు అమరత్వం పొందగ
పొన్ను కర్ర చెన్నా పొక్క పొడవ లేదా

పాము ఎన్నటికైనా పామే
పాము సోపతి పడగ నీడే
చరిత్ర కమ్మలు మర్లేసి సూడు
కమ్మ కమ్మలో
కమ్ముకున్నధగా కన్పిస్తది

24-7-2005
ఆదివారం ముసురుపడంగ



# అక్షరం

పదం పాలు తాగింది
అక్షరం సాన పట్టుకున్నది

వాక్యం నుంచి పదాన్ని
వేరుచేస్తే
పదం పామై కదం తొక్కుతది

బందీ చేస్తే
అక్షరం అగ్గిపిడుగైతది

అక్షరాలు పదాలై వాక్యాలు వాక్యాలుగా
ఊరూ అడవీ కలె తిరిగినయ్

పాటలకు చెవులు మూసుడు
బాటలకు ఎనుగు నాటుడు
ఇగ కలువని ముచ్చట
ఇదంతా చేతులతో
గాలిని
దొరకపట్టినట్లే

4-9-2005





# అయ్య

పచ్చ పచ్చగా చిగురించేందుకు
పందిరి లాంటి ఆలంబన

అంబాడి అంబాడి బుచ్చిబుచ్చిగా
అడుగులేస్తున్నప్పుడు
చెయ్యి చాపిన చూపు తొలి సోపానం

చేతికిచ్చిన పలకా బలపం
దిద్దిచ్చిన అఆ ఇఈ లు
జీవితాన్ని సజీవంగా నిలుపుతున్నాయి

నాయిన భుజం మీద కూర్చున్న నాడే
అందరి కంటే ఎత్తు పెరిగిన అనుభూతి
కొత్త లోకం లోకి తొంగి చూసేందుకు
చూపుడు వేలి స్పర్శ

మంచిని వస్త్రగాలంతో ఎంచుకుని
పది మందితో పంచుకునుడు

మాట్లాడుడైనా కొట్లాడుడైనా
మనసిచ్చుడైనా ఎదిరించుడైనా
అన్నీ అయ్య బుద్దులే

బూరుగు మొద్దుతో ఈత నేర్పంగ
మొస మఱ్రక మింగిన నీళ్ళు
సైకిల్ కైంచి నేర్పినప్పుడు
పలిగిన మోకాలి శిప్ప
సాఫల్య వైఫల్యాలన్ని
నిత్యజీవన సమరంలో ప్రతిఫలిస్తున్నాయి.

నాన్న గురువే కాదు
అమ్మ కూడా
నాన్న ఒక స్నేహితుడు
నాన్న నికసించిన నవ్వు
విరబూసిన పువ్వు

1-10-2005



# తెలంగాణా పల్లె కన్నీళ్ళ కోనేరు

అన్నవరం దేవేందర్ ఇప్పటికే రెండు కవితా సంపుటులు ప్రచురించాడు. అవి తొవ్వ, నడక, ఆయన ఈ మధ్య 'సందుగ' అనే కవిత రాశాడు. సందుగ అంటే పెట్టె. పూర్వం ఇళ్ళల్లో బీరువాలు లేవు. అలమారాలు లేవు. అప్పుడు వున్నవి సందుగలే. సందుగ లోనే సర్వస్వం వుండేవి. అలాంటి సందుగ తాళం అనుం శెడి పోయిందని దేవేందర్ అంటున్నాడు. దేవేందర్ బాల్యం కశ్కెలో దాచుకున్న కమ్మని పాలగోకు. అతని బాల్యం తంపిలో కాల్చుకున్న ల్యాత మక్క కంకి. కొత్త కొండ తీర్థంలో తిన్న శిల్కల పేరు. అతని కవిత్వం నిండా తెలంగాణా జీవితం, తెలంగాణా బాష ప్రవహిస్తుంది. గాయమై స్రవిస్తున్న తెలంగాణా భాష ప్రవహిస్తుంది. తెలంగాణా పల్లె బతుకులకు కవిత్వ లేపనం రాస్తున్న కవి దేవేందర్. కరీంనగర్‌లో లేబర్ అడ్డా వుంటుంది. ఒక్క కరీంనగర్‌లోనే కాదు బహుశా ప్రతి పట్టణంలో అలాంటి అడ్డా వుండవచ్చు. దేవేందర్ చూసింది కరీంనగర్ లేబర్ అడ్డా. దాన్నే 'మంకమ్మతోట లేబర్ అడ్డా'గా కవిత్వీకరించాడు. నిలువెత్తు మనిషి అడ్డాలో ఎలా వుంటాడు. దేవేందర్ మాటల్లో.

పల్లె పొలిమేరలు దాటి
అడ్డమీద సరుకుగా మారిని సందర్భం
అంగడిలో గొడ్డు గోదా అమ్ముడుపోయినట్లు
నిలువెత్తు మనిషి
తనకు తానే అమ్ముకుంటున్న దృశ్యం

లేబర్ అడ్డా మీది మనుషులు ఎలా వుంటారు. బక్క చిక్కిన దేహాలు, లొట్టబోయిన కండ్లు, గోస గోస మాటలు, గోవుల్లాంటి చూపులు. పనికి ఎవరు పిలుస్తరా అని వాళ్ల ఎదురుచూస్తూ వుంటారు. వాళ్ళందరి చేతిలో ఏముంటాయ్?

సున్నం వేసే కుంచెలు
తట్ట పార, గడ్డపారలతో
పల్లె తరుముతె
పక్షులన్నీ అడ్డా మీద వాలాయ్

చేయి సంచిల సద్దిగిన్నె
బజ్జ మీద తువ్వాల
ఇంకో చేతిల అతారెలు
ఎవలు పిలుస్తరా అని ఎదిరి చూపులు

తెలంగాణా భాషను ఉపయోగిస్తున్న కవులు అరుదు. ఇప్పుడు తెలంగాణా భాషలో కవిత్వం రాయడానికి కవులు ప్రయత్నం చేస్తున్నారు. తెలంగాణా భాషలోని పదజాలాన్ని అలవోకగా వాడుకున్న కవి దేవేందర్. ఆయన కవిత్వంలో ఆ పదజాలాన్ని ఉపయోగించినట్లు అన్పించదు. అవి ఆ కవితలో అలవోకగా చేరిపోతాయి. దేవేందర్ పల్లె జీవితాన్ని దగ్గరగా చూసినవాడు కనుక అతని కవిత్వంలో తెలంగాణా పదజాలం ఇమిడిపోతుంది. అతని ఏ కవిత చూసినా ఆ విషయం స్పష్టమవుతుంది. 'చేయు సంచిల సద్దిగిన్నె ఇంకో చేతిల అతారెలు' అంటే పనిముట్లు అవి ఎంత అలవోకగా పడ్డాయి. ఆ కవిత ఇంకా ఇలా కొనసాగుతుంది.

నున్నగా తారురొడ్డు పరిచి
కలల కూడా డ్రైవింగ్ చేయని వాళ్ళు
ఫోన్ లైన్ల కోసం కందకాలు తవ్వీ తవ్వీ
'హలో' అని పలకని వాళ్ళు
పాలరాళ్ళతో భవనాలెన్నో కట్టి
పూరి గుడిసెల్లోనే జీవించే వాళ్ళు
మరి వాళ్లందరూ ఎక్కడినుంచి వచ్చారు.
ఉస్నాద, ఎములాడ, సిర్సిల్ల
చినుకుల కురవని పల్లెలు ఎల్లగొడితే
అడ్డమీద కూలీలైరి

వాళ్ళందరూ హుస్నాబాద్, వేములవాడ, సిరిసిల్ల వూర్ల నుంచి అడ్డ మీదికి వచ్చి కూలీలైనారు. చినుకులు కురవని పల్లెలు ఎల్లగొడితే వచ్చినారు. దేవేందర్ ఏ కవిత తీసుకున్నా భాషని అరువు తెచ్చుకున్నట్టుగా కన్పించదు. అందులో ఇమిడి వుంటుంది. అదే దేవేందర్ కవిత్వంలోని ప్రత్యేకత ఇదొక్కటే కాదు. అతని కవిత్వం సూటిగా స్పష్టంగా వుంటుంది. 'పోత్రవుతులు' అన్న కవితలో ఇలా అంటారు.



ఊర చెర్ల ఈతగొట్టంగ
పురుసాలకు జనిగె బట్టినట్లు
పుక్యానికి కరెంటని ఏతులు కొట్టిరి
అక్రమ కనెక్షన్లని ఇపుడు బొండిగ పట్టిరి!

చెరువులో ఈత కొట్టంగ పురుసాలకు జనిగె బట్టినట్లు పల్లె జీవితం తెలిసిన కవి మాత్రమే ఈ మాటలు చెప్పగలడు. అతనికి అండ్ల దుర్గం ఇండ్ల దుర్గం మత్వ రిచ్చుడు సప్పరిచ్చుడు రాదు. అంతా నిక్కచ్చి ముచ్చటే. అతని కవిత్వమంతా ఇంతే.

తెలంగాణా పల్లెలో నిర్బంధం, ఎన్‌కౌంటర్లు, మరోవైపు ఆకలి చావులు పాతాళంలోకి ఇంకిపోయిన నీళ్ళు, గుంజుకుపోయిన రైతుల డొక్కలు, పచ్చని ఆకుల్లోని పత్రహరితాన్ని ఆరగిస్తున్న బహుళజాతి కంపెనీలు ఈ విచ్ఛిన్నమవుతున్న తెలంగాణా పల్లె దేవేందర్ కవిత్వానికి బిందువు. ఈ పల్లె ఎలా ఉందో దేవేందర్ మాటల్లో చూద్దాం.

'కను కొనల నుంచి రాలుతున్న సముద్రం
తెల్లంగాణా పల్లె
ఇది కన్నీళ్ళ కోనేరు
ఒకవైపు
ఉడుకుతున్న నెత్తుటి సంగీతం
మరోవైపు
రివ్వుమంటున్న బుల్లెట్ల వాన
ఊగుతున్న ఉరితాళ్ళ చప్పుడు
బక్క చిక్కిన బతుకుల్లో ఆత్మహత్యల సన్నివేశాలు'

తెలంగాణ పల్లె కన్నీళ్ళు కోనేరన్న వాస్తవాన్ని కవిత్వీకరించాడు అన్నవరం. అతని పల్లె రెక్కలు తెగిపడ్డ గువ్వ. కచ్రం బండి కమ్ముకూలిన నేపథ్యం అతని ఊరు. ఇంకా అతని ఊరు ఇరిగిపోయిన పెంటపొనుక, తూట్లు పడ్డ వడ్ల బోరెం. కూలిపోయిన పిడికెల కుచ్చె. చెదలు పట్టిన పాతగుమ్మి. పగిలిపోయిన కూరాటి కుండ. అలాంటి వాతావరణంలో వున్న అన్నవరం దేవేందర్ ధిక్కరించిన స్వరం. రహస్య అలజడి, పగులుబారిన జైలుగోడ.

**- జింబో**

ఆంధ్రభూమి సాహితి, 'గుండె తడి' శీర్షిక,
29 నవంబర్, 2004.

అన్నవరం దేవేందర్

<u>పుస్తకాలు:</u>

2001 'తొవ్వ' కవితా సంకలనం

2002 'మరోకోణం' సామాజిక వ్యాసాలు

2003 'నడక' కవితా సంకలనం

2005 'మంకమ్మ తోట లేబర్ అడ్డా' కవితా సంకలనం

<u>పురస్కారాలు:</u>

2001 మహాత్మా జ్యోతిభా పూలే ఫెలోషిప్

2004 అన్నమయ్య కల్చరర్ అకాడమీ ఉగాది పురస్కారం

2004 రంజని - కుందుర్తి ఉత్తమ కవితా పురస్కారం





2003 నవంబర్ 9న తెలంగాణా రచయితల వేదిక ఆదిలాబాద్ జిల్లా
మహా సభల్లో 'నడక' ఆవిష్కరిస్తున్న డా॥ నలిమెల భాస్కర్.
వేదికపై ముదిగంటి సుజాతారెడ్డి, అన్నవరం, వసంతరావు దేశ్‌పాండే, డా॥ సామల సదాశివ



2004 నవంబర్ లో హైద్రబాద్ త్యాగరాజ గానసభలో రంజని-కుందుర్తి పురస్కారం ప్రదానం చేస్తున్న
కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డ్ గ్రహీత కె. శివారెడ్డి
వేదికపై తెలుగు విశ్వ విద్యాలయం ప్రొఫెసర్ మృణాళిని.



'మంకమ్మతోట లేబర్ అడ్డా' కు

చెయ్యందించిన దోస్తులు

బస్వరాజు లక్ష్మి-శంకర్,

కల్పన-సంపత్ లకు కృతజ్ఞతలు...

— అన్నవరం దేవేందర్